# సూరత్ లో

మూలము :

టాల్ స్టాయ్

అనుసరణ :

శ్రీ ఆచార్య, యం. ఏ., బి. యిడి.

ప్రకాశకులు :

**విజయశ్రీ పబ్లిషింగ్ కో., విజయవాడ-2.**

విద్యావిషయిక ప్రచారకులు.

# విషయ సూచిక



వెల **75** న. పై.



మొదటి ముద్రణ
1959

ఉమా ప్రింటర్సు, విజయవాడ-1

# సూరత్ లో

సూరత్ భారతదేశములోని ఒక సుందరనగరము. అందొక ప్రాంతమున ఒక చక్కని కాఫీదేవాలయముగలదు. పలువురు యాత్రికులు, ఇతర దేశీయులు ప్రపంచములోని నలుమూలలనుండి అచ్చటకు వచ్చి సమావేశమై వివిధ విషయములను గూర్చి మాటాడుకొనుచుందురు.

ఒకనాడు ప్రసిద్ధిగాంచిన పర్షియను పండితు డొకడా కాఫీదేవాలయమునకు విచ్చేసెను. ఆతడు తన జీవితమును దేవుని తత్వమునుగూర్చి తెలిసికొనుటకు వినియోగించిన మహనీయుడు. ఆతడావిషయమునుగూర్చి ఎంతగా ఆలోచించెనో! ఎన్ని పొత్తములను చదివెనో!! ఎన్నిగ్రంథములను వ్రాసెనో!!! అందువలననే ఆతని మతి పోయినది; అభిప్రాయములు తారుమారైనవి; కడకు భగవంతుడే లేడను నాస్తిక వాదమునకు దిగినాడాతడు! ఆవిషయము పర్షియను చక్రవర్తికి తెలిసినది. వెంటనే ఆ పండితుని దేశమునుండి బహిష్కరించినాడు.

ఆ పండితుడు జీవితమంతయు దేవునిగూర్చి ఆలోచించినాడు. కడకా దురదృష్టవంతుడు మతిపోగొట్టుకొన్నాడు. తనకు మతిపోయినదను విషయమును అంగీకరించుటకు బదులు, సృష్టికర్తయగు దేవుడే లేడని ప్రచారము ప్రారంభించినాడు!

ఆ పండితునివద్ద ఆఫ్రికా బానిసయొకడు కలడు. ఆ బానిస ఎప్పుడును పండితునితో బాటుగనే ఉండెడివాడు.

పండితుడు కాఫీదేవాలయములో ప్రవేశించినపుడు బానిస బయటనే ద్వారమువద్ద ఒక శిలపై కూర్చుండియుండి చుట్టును మూగుచున్న ఈగలను తోలుకొనుచుండెను. పండితుడు లోపలకుపోయి ఒక ఆసనముపై కూర్చుండి నల్లమందు పానీయమును తీసికొనిరమ్మని లోని వాని కాజ్ఞాపించెను. పానీయము రాగానే ఆతడు దానిని పూర్తిగా త్రాగివైచెను. అప్పు డాతనిబుద్ధి ఎంతో చురుకుగా పనిచేయసాగెను. ఆచురుకుతో నాతడు ఎదురుగా కనబడుచున్న బానిసతో ఇట్లనియెను. "ఓ నీచుడా! ఒక్కవిషయమును చెప్పుము. భగవంతుడున్నా డందువా? లేడందువా?"

"భగవంతుడున్నాడు" అని బానిస సమాధాన మిచ్చెను. వెంటనే ఆతడు తన మొలలోనుండి ఒక చిన్న కఱ్ఱవిగ్రహ మును బయటకుతీసెను. పిమ్మట ఆతడింకను ఇట్లనెను. "నేను పుట్టినప్పటినుండి ఈనాటివఱకు నన్ను రక్షించుచున్న మహ నీయుడు ఈ భగవానుడే. మాదేశములో ప్రతియొక్కరు ఒక వృక్షమును గొప్ప భక్తిభావముతో పూజింతురు. ఆ చెట్టుకఱ్ఱతోనే ఈ చిన్నవిగ్రహము చేయబడినది."

వారిరువురి సంభాషణ కాఫీదేవాలయములోనున్న మిగి లినవారి నాకర్షించెను. వారా సంభాషణను వినసాగిరి. పండి తునిప్రశ్న వారి కాశ్చర్యమును కలిగించెను. బానిస యిచ్చిన సమాధానమును విని వారంతకంటె ఎక్కువగా ఆశ్చర్యపడిరి.

అచ్చట నున్నవారిలో ఒక బ్రాహ్మణుడుండెను. ఆతడు బానిస సమాధానమును విని ఆతని వంకకు తిరిగి యిట్లనెను. "బుద్ధిహీనుడా! సర్వసృష్టికర్తయగు భగవంతుని

మొలలో పెట్టికొని మోసికొని పోవచ్చునని భావించు చున్నావా? దేవుడొక్కడే; అతడే బ్రహ్మ, ఆతడే సర్వప్రపంచముకంటె గొప్పవాడు. ఏలయన దానిని సృష్టించిన మహనీయుడాతడే కదా! సర్వశక్తి సంపన్నుడగు భగవానుడే బ్రహ్మ. ఆయనను మించినవారు మఱి యితరులెవ్వరును లేరు. ఆయన గౌరవార్థము పవిత్ర గంగానదీ తీరమున అనేక గొప్ప దేవాలయములు నిర్మింపబడినవి. అచ్చట భగవద్భక్తులగు బ్రాహ్మణులా మహనీయుని ప్రతినిత్యమును పూజింతురు. నిజమైన భగవంతు డెవ్వడో వారికిమాత్రమే తెలియును. మిగిలిన వారి కెవ్వరకు తెలియదు. ఇప్పటికి కొన్నికోట్ల వత్సరములు గడచినవి. ప్రపంచములో విపరీతమార్పులు అనేకము వచ్చినవి. కాని బ్రాహ్మణులుమాత్రము తమ ఆధిక్యతను కోల్పోలేదు. అందుకు కారణమేమో తెలియునా? భగవంతుడు వారినెల్లప్పుడును సంరక్షించుచుండుటయే!"

తనమాట లందఱకు నచ్చునను ఉద్దేశ్యముతోను, ఆత్మవిశ్వాసముతోను, గర్వముతోను బ్రాహ్మణు డావిధముగా మాటాడెను. కాని యాతనిమాటలు అచ్చటనేయున్న ఒక యూదునకు నచ్చలేదు. అందువలన నాతడిట్లనియెను. "అంతయు అసత్యము! నిజమైన భగవంతుని దేవాలయము భారతదేశములో లేనేలేదు! మఱియు భగవంతుడు బ్రాహ్మణ కులమును రక్షించుటలేదు. బ్రాహ్మణుల దేవుడు నిజమైన దేవుడుకాడు. అబ్రహాం, ఐజాక్, జాకబ్‌ల దేవుడే సత్యమైన దేవుడు. ఆతడు యూదులనుతప్ప మఱి యితరుల నెవ్వరిని రక్షింపడు. ఈ విశాలప్రపంచము సృష్టింపబడిన నాటినుండి

మాజాతి ఆతనికి ప్రియమైనది. మాజాతిమాత్రమే ప్రియమైనది. ఈనాడు మేము ప్రపంచ మందంతటను చెల్లాచెదరై యున్నాము ఎందులకందురా? భగవంతుడు మమ్ము పరీక్షించుటకే యిట్లు చేసినాడు. ఒక శుభదినమున మమ్మందఱను జెరూసలెంలో తిరిగి సమావేశపఱతునని భగవానుడు పవిత్ర వాగ్దానము చేసియున్నాడు. అప్పుడు అద్భుతములలోకెల్ల అద్భుతమైన జరూసలెం పవిత్రదేవాలయము తిరిగి తన తొంటి వైభవమును పొందగలదు. అప్పుడు మేమే ప్రపంచమునంతను ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలింతు మనుట తథ్యము."

యూదుడట్లు మాట్లాడి కన్నీరు కార్చసాగెను. ఆతడింకను కొన్ని విషయములను చెప్పసాగెను. కాని యంతలో కేథలిక్ క్రైస్తవ డొకడు జోక్యము కలుగజేసికొని యిట్లనెను" ఓ యూదుడా! నీవు అసత్యమును పలుకుచున్నావు. భగవంతుడు అన్యాయవంతుడని నీవు చెప్పుచున్నావు. భగవంతుడు మీజాతినే ప్రేమించుచున్నాడనియు, ఇతర జాతులను ప్రేమించుచుండుట లేదనియు చెప్పుట అన్యాయము; అక్రమము. పూర్వమాతడు మిమ్మే ప్రేమించెనని మాటవరుస కంగీకరింతము. మీరాతనికి కోపము తెప్పించి పందొమ్మిది వందల వత్సరములైనది. అప్పుడు ఆతడు మీజాతిని నాశనము చేసినాడు. అందువలననే మీరు ప్రపంచమందంతట చెల్లాచెదరైనారు. ఇప్పుడు క్రొత్తగా మిమ్మనుసరించువారు లేరు. మీరుగూడ అంతరించిపోవుటకు సిద్ధముగానున్నారు. భగవంతుడే జాతినిగాని ప్రత్యేకముగా ప్రేమింపడు. పాప పంకిలమునుండి రక్షింపబడగోరువారందఱు రోమను కేథలిక్ చర్చి నాశ్రయింప

వలెననిమాత్రమే ఆతడు కోరును. ఆచర్చిలో చేరక బయట నున్నవారికి ముక్తిలేనేలేదు."

కేథలిక్ క్రైస్తవునిమాటలను అచ్చటనేయున్న ప్రొటెస్టెంటు క్రైస్తవుడొకడు వినెను. ఆతడు వెలవెల పోవుచు కేథలిక్ క్రైస్తవునితో ఇట్లనియెను. "కేథలిక్ చర్చి నాశ్రయించుటవలననే ముక్తికలుగునని నీ వెట్లు చెప్పగలవు? మహనీయుడగు ఏసుక్రీస్తు ఏమని బోధించియున్నాడు? పవిత్రగ్రంథములో ఏమి వ్రాయబడియున్నది." దానిని ఎవ్వరు త్రికరణశుద్ధిగ అనుసరింతురో వారే ముక్తిని పొందగలరు."

అచ్చటనే పొగపీల్చుచున్న తురుష్క ఉద్యోగి యొకడుండెను. ఆతడు అధికారదర్పముతోను, ఎక్కువ వాడనన్న భావముతోను ఇద్దరు క్రైస్తవుల వంకకుతిరిగి యిట్లనెను. "మీరు క్రైస్తవమతమును నమ్ముకొని యుండుట వట్టివృథాయని నేను స్పష్టముగ చెప్పగలను. పండ్రెండు వందల సంవత్సరములక్రిందట మహమ్మదువారు జన్మించి క్రైస్తవ మతమునే రద్దుచేసినారు! ఇప్పుడు మహమ్మదీయ మతముమాత్రమే ప్రజలను సంరక్షింపగలదు. మహమ్మదీయుమతము యూరపు, ఆసియా ఖండములలో ఎట్లు శరవేగమున వ్యాపించుచున్నదో మీరే గమనించుచున్నారు గదా! నాగరికదేశమని ప్రసిద్ధిగాంచిన చైనాలోకూడ ఈ మతము వ్యాపించుచున్నది. భగవంతుడు యూదులను తిరస్కరించినాడని మీరే అంగీకరించుచున్నారు కద! అందువలననే వారు ప్రపంచమంతయు చెల్లాచెదరైనారనియు, వారి మతము వ్యాపించుట లేదనియు మీరనుచున్నారు. అదేవిధముగా క్రైస్తవ మతము నశించి, మహ

మ్మదీయ మతము వ్యాపించుచున్నది. మీరు మహమ్మదీయ మత ఆధిక్యతను అంగీకరింపుడు. అది యిప్పుడు ప్రపంచము నలుమూలల వ్యాపించుచు విజయపతాకమును ఎగురవేయు చున్నది. ఇంతవఱకు భగవంతునికి ప్రియమైనవాడు మహమ్మదు మాత్రమే. అందువలన మహమ్మదీయులుమాత్రమే ముక్తిని పొందుదురు. అందును ఓమార్ అనుచరులు మాత్రమే ముక్తి కర్హులు; ఆలీ అనుచరులు ఇసుమంతయు అర్హులుకారు."

ఆలీ శాఖకుచెందినవాడే పర్షియను పండితుడు. ఆతడు తురుష్కుని మాటలను విని జవాబీయవలెనని తలచెను. కాని యచ్చటనున్నవారిలో గొప్ప కలహము బయలుదేరెను. వారిలో అబిసీనియను క్రైస్తవులు, టిబెట్ లామాలు, ఇస్మాయిలీలు, పార్సీలు మున్నగువారందఱు నుండిరి. వారందఱును భగవంతుని తత్వమునుగూర్చియు, ఆతనిని పూజింపవలసిన విధానమునుగూర్చియు తీవ్రమైన చర్చలు ప్రారంభించిరి. ప్రతియొక్కరును తమదేశములోనే నిజమైన దేవుడున్నాడనియు, తమకే సరియైన పూజావిధానము తెలియుననియు నొక్కివక్కాణింప సాగిరి.

అందఱును ఆవిధముగా వాదనలు సాగించిరి. కాని కన్ఫ్యూసియస్ శిష్యుడగు చీనావాడొకడు కాఫీదేవాలయములో ఒకమూల కూర్చుండి యుండెను; ఆతడు మాత్ర మచ్చటి వాదనలలో పాల్గొనలేదు. ఆతడు తేనీటిని త్రాగుచు మిగిలినవారి వాదనలను వినసాగెను. ఆతడు మాత్రము మాటాడక యుండెను.

మూల కూర్చున్న చీనావానిని చూచి తురుష్కు-

డాతనితో ఇట్లనియెను. "ఓ చీనామిత్రుడా! నీవు నేచెప్పిన విషయమును బలపఱచుము. నీవేమో మాట్లాడకుండ మూల కూర్చున్నావు. కాని నీవు మాటాడినచో తప్పక నామాటలను బలపఱతువని నేనెఱుగుదును. మీ దేశమునుండి యిచ్చటకు వచ్చువారు పలువురు నా సాహాయ్యము నపేక్షించి నా వద్దకు వత్తురు. వారు నాతో నిట్లు చెప్పుచుందురు : "మా దేశములో పలుమతములున్నమాట నిజమే. కాని అన్ని మతములలోకి మహమ్మదీయమతమే ఉత్కృష్టమైనదని మేమంగీకరింతుము. దానినే ఎక్కువమంది అనుసరింతుము." ఓమిత్రుడా! నేను చెప్పినమాటలు నిజమేనని చెప్పుము. నిజమైన దేవుని గూర్చియు, మహమ్మదు ప్రవక్తనుగూర్చియు నీ యభిప్రాయమేమో తెల్పుము."

అప్పుడు మిగిలినవారందఱు ఇట్లనిరి. "అవును, అవును; ఈవిషయమును గూర్చి నీ యభిప్రాయమేమో వినవలెనని మే మందఱము కడు ఆతురముతో ఉన్నాము."

అంతట చీనావాడు కన్నులు మూసికొని కొంతవడి ఆలోచించెను. పిమ్మట నాతడు కన్నులను తెఱచెను. హస్తములను ఱొమ్ముభాగముపై పెట్టుకొని అతి ప్రశాంతముగ నిట్లనియెను.

"అయ్యలారా! మతసంబంధమైన విషయములలో ఒకరి కొకరికి పొత్తుకుదురుటలేదు. ఇందులకు కారణమేమి? అనవసరమైన గర్వమే కారణము. మీరు వినుట కిచ్ఛగించినచో ఉదాహరణగా నేను ఒక చక్కని కథను చెప్పెదను. అప్పుడు మీకు విషయమంతయు బాగుగా అర్థమగును.

నేనిచ్చటకు చైనానుండి ఒక ఇంగ్లీషు స్టీమరుపై వచ్చి

నాను. మేము మంచినీటికొఱకు సముద్రతాదీవి తూప్పుతీరమున దిగినాము. అప్పటికి మధ్యాహ్నమైనది మాలో కొందఱము సముద్రతీరమున ఒక గ్రామమునకు సమీపముననేయున్న కొబ్బరిచెట్లనీడలో కూర్చుంటిమి. అక్కడ నున్నవారము అనేక జాతులకు సంబంధించి యుంటిమి.

మేమచ్చట కూర్చుండగా ఒక గ్రుడ్డివాడు మావద్దకు వచ్చెను. ఆతడు పూర్వము సూర్యుడెట్టివాడో తెలిసికొనుటకు ప్రయత్నించెను. సూర్యకాంతిని పట్టుకొనదలచెను. అందువలన నాతడు విడువకుండ సూర్యునివంకకు చూడసాగెను. తత్ఫలితముగా ఆతడు గ్రుడ్డివాడాయెను. ఆవిషయమును మేము తరువాత తెలిసికొంటిమి.

ఆతడు మాటిమాటికి ఇట్లనుకొనుచుండెను. సూర్యకాంతి ఒక ద్రవముకాదు. ద్రవమే యైనచో దాని నొక పాత్రలోనుండి మఱియొక పాత్రలోనికి పోయుటకు వీలుండెడిది. మఱియు అది గాలికి నీటివలె కదలుచుండెడిది. అది అగ్నికూడ కాదు. ఏలయన్న అగ్నియైనచో అది నీటితో ఆరిపోయియుండెడిది. అది దయ్యముకూడ కాదు. ఏలయన అది కంటికి కనబడుచున్నది. అది పదార్థముకూడ కాదు. ఏలయన దానిని కదల్చుటకుగూడవీలు లేదు. సూర్యకాంతి ద్రవముకాదు; అగ్నికాదు; దయ్యముకాదు ; పదార్థముకాదు అది ఏదియు కాదు."

ఆవిధముగా ఆతడనుకొను చుండెడివాడు. ప్రతినిత్యమును సూర్యునివంకకు చూచుచుండుటవలనను, దానినిగూర్చి ఆలోచించుటవలనను ఆతనికి గ్రుడ్డితనము సంభవించుటతో

బాటు మతికూడ చెడిపోయెను. ఆతడు పూర్తిగా గ్రుడ్డివాడై తరువాత అసలు సూర్యుడే లేడని గట్టిగా నమ్మసాగెను.

గ్రుడ్డివానితో బాటు ఆతని బానిసగూడ మేమున్న చోటకు వచ్చెను. ఆబానిస తన యజమానుని ఒక కొబ్బరి చెట్టునీడలో కూర్చుండబెట్టెను. పిమ్మట నాతడు నేలపైపడి యున్న కొబ్బరికాయ నొకదానిని తీసికొని రాత్రికి పనికివచ్చు దీపముగా తయారుచేయసాగెను. ఆతడు కొబ్బరిపీచుతో ఒక వత్తితయారుచేసెను. కొబ్బరిచిప్పలోనికి నూనెను పిండి వత్తిని అందులో నానవేసెను.

బానిస ఆపనిని చేయుచుండగా, గ్రుడ్డివాడు నిట్టూర్పు పుచ్చి ఆతనితో ఇట్లనియెను, "ఓ బానిసీడా! సూర్యుడు లేడని నేనుచెప్పిన మాట నిజముకదా! ఇప్పుడెంత చీకటిగా నున్నదో చూడుము. అయినను జనులు సూర్యుడున్నాడని చెప్పుచుందురు. ఉన్నాడే అనుకొందము. అతడెట్లుండును? నీవు చెప్పగలవా?"

అపుడు బానిస యిట్లనెను, "సూర్యుడెట్లుండునో నాకు తెలియదు. ఆవిషయముతో నాకెట్టిసంబంధమును లేదు. కాని కాంతియన నేమోమాత్రము నాకు తెలియును. నేనిప్పుడు రాత్రికి ఉపయోగించు దీపము నొకదానిని తయారుచేసినాను. దీని సహాయ్యముననే నేను మీకు సేవచేయగలను; ఇంటిలో ఎచ్చట ఏ వస్తువున్నదో తెలిసికొనగలను."

బానిస యింకను కొబ్బరిచిప్పను పైకెత్తి, "ఇదియే నా సూర్యుడు" అని అనెను.

అచ్చటకు సమీపముననే కూర్చుండి యున్నకుంటి

వాడొక డంతయువిని నవ్వి గ్రుడ్డివానితో ఇట్లనియెను,“సూర్యు డననేమో నీకు తెలియదా? నీవు బహుశా పుట్టుగ్రుడ్డివాడ వను కొందును. అయినచో నేను చెప్పెదను వినుము. సూర్యు డొక అగ్నిగోళము. ఆతడు ప్రతిదినమును ఉదయమున సము ద్రములోనుండి పైకివచ్చును. ప్రతి సాయంకాలము పర్వత ములలోనికి దిగిపోవును. మేమందఱము ప్రతిదినము ఈ దృశ్య మును చూచుచునే యున్నాము. నీకుకూడ కన్నులున్నచో ఈ దృశ్యము తప్పక కనబడుననుటలో ఎట్టిసందేహమును లేదు.”

అప్పుడు సంభాషణమంతయు చక్కగా నాలకించు చున్న జాలరి యొకడిట్లనెను, “మిత్రుడా!నీమాటల నాలకింపగా నీవెన్నడును నీ దీవిని దాటి పోలేదని స్పష్టమగుచున్నది. నీవు కుంటివాడవు. అందువలన నీవు నావలె ఎన్నడును పడవలలో సముద్రముపై ప్రయాణముచేయలేదు. సూర్యుడు ప్రతిసాయం కాలమును పర్వతములలో అస్తమింపడు. సముద్రముపై ప్రయాణముచేయువారికి మాత్రమే నిజమైన విషయము తెలి యును. సూర్యుడు ఉదయకాలమున సముద్రములోనుండి పైకి వచ్చును; అదేవిధముగా ప్రతిదినము సాయంకాలమున సము ద్రములోనికి క్రుంకిపోవును. సూర్యుడగ్నిగోళ మనుమాట నిజము; నేను చెప్పినదంతయు నిజమే. నేను ఈ విషయమును ప్రతిదినమును నా కన్నులతో చూచుచున్నాను.

అపుడు మాలోని ఒక భారతీయుడు అడ్డువచ్చి యిట్ల నెను, “నీవంటి లోకజ్ఞానము కలవాడు ఇట్లుమాటాడుట నా కాశ్చర్యము గొల్పుచున్నది. సూర్యుడగ్నిగోళమైనచో నీటిలో మునిగినపుడు ఏల చల్లారిపోవుటలేదు? సూర్యుడగ్నిగోళము

కానేకాదు. ఆతడొక దేవత. ఆతడు ప్రతినిత్యమును గుఱ్ఱములు పూన్చిన రథముపై నెక్కి మేరుపర్వతము (బంగారు కొండ)చుట్టును తిరుగుచుండును. ఒక్కొక్కప్పుడు దుష్టసర్పములగు రాహు, కేతువులు అతనిని మ్రింగివేయుచుండును. అప్పుడు భూమియంతయు చీకటిమయ మగును. కాని మా పురోహితులు సూర్యునకు స్వేచ్ఛకలుగవలెనని ప్రార్థనలు చేయుదురు. అప్పుడు సూర్యునకు సర్పములనుండి స్వేచ్ఛకలుగును. నీవంటివారు మాత్రమే సూర్యుడు తమ దేశమునకే కాంతి నొసగుచున్నాడని భావింతురు".

అంతట అచ్చటనున్న ఒక ఈజిప్టునావికుడిట్లనెను, "కాదు కాదు. నీవుచెప్పినదంతయు వట్టి అసత్యము. సూర్యుడు దేవతకాదు. అతడు మీభారతదేశము చుట్టును, మేరుపర్వతముచుట్టును మాత్రమే తిరుగుట లేదు. నేను నల్లసముద్రముపై ప్రయాణము చేసినాను. అరేబియా తీరములో సంచరించినాను. మడగాస్కరుదీవికి, ఫిలిప్పయినుదీవులకు ప్రయాణమై పోయినాను. సూర్యుడు ప్రపంచమునకంతకు కాంతినొసంగుచున్నాడు. ఒక్క భారతదేశమునకు మాత్రమేకాదు! ఆతడు ఒక్క మేరుపర్వతమునే చుట్టుట లేదు! ఆతడు తూర్పుదిక్కున ఎంతో దూరమున జపానుదీవులకావలఉదయించుచున్నాడు. ఎక్కడో పశ్చిమ దిగ్భాగమున ఇంగ్లీషు దీవులకావల అస్తమించుచున్నాడు. అందులకే జపానువారు తమదేశమును నిప్పన్(సూర్యునకు జన్మస్థానము)అని పిలుతురు. నాకీ విషయమంతయు బాగుగా తెలియును. ఏలయన నేను స్వయముగా చూచినాను. మరి యనేక విషయములను మాతాజీగారి వద్ద

నుండి తెలిసికొన్నాను. ఆయన ప్రపంచమునంతను చుట్టి వచ్చిన అనుభవశాలి."

ఆతడింకను ఆ విధముగా చాలసేపు చెప్పుకొని పోయెడి వాడే. కాని మానావలోని ఆంగ్లనావికుడొకడు అడ్డువచ్చి యిట్లనెను, "సూర్యుని గమనమును గూర్చి మా దేశములోని వారికి తెలిసినన్ని విషయములు మఱియే యితర దేశములోని వారికిని తెలియవనుట తథ్యము. సూర్యుడొకచోట ఉదయించుట, మఱియొకచోట అస్తమించుట అను పనులు జరుగనే జరుగవు. ఈ విషయము ఆంగ్లేయుల కందఱకు తెలియును. మఱి నిజముగా జరుగుచున్న పని యేమి? సూర్యుడు ప్రతినిత్యమును భూమి చుట్టును తిరుగుచున్నాడు. ఇందుకు సందేహమేమియు లేదు. ఏలయన మేమిప్పుడే భూప్రదక్షణముచేసి వచ్చుచున్నాము. మేమెప్పుడును సూర్యునికలిసికో లేదు. మేమెక్కడకు పోయినను ఉదయముననే సూర్యుడుకనబడుట, సాయంకాలము కాగానే మాయమగుట జరుగుచున్నది"

పిమ్మట ఆంగ్లేయుడు ఒక కఱ్ఱనుతీసికొని ఇసుకలో వృత్తములనుగీచి సూర్యుడాకశమునసంచరించుచు భూమిచుట్టు నెట్లు తిరుగుచున్నాడో వివరించి చెప్పసాగెను. కాని యాతడా విషయమును సుస్పష్టముగా వివరించి చెప్పలేకుండెను. అందువలన నాతడు ప్రధాన నావికునివంకకు చూపుచు ఇట్లనియెను. "ఈవిషయములనుగూర్చి ఈతనికి నాకంటె ఎక్కువగా తెలియును."

ప్రధాననావికుడు చాలా తెలివైనవాడు. ఆత డంతవఱకు అందఱును మాటాడుచుండగా వినుచుండెనేగాని తానేమియు

మాటాడకుండెను. ఆంగ్లనావికుని మాటలనువిని అందఱును ప్రధాననావికుని వంకకు తిరిగిరి. అప్పుడాతడిట్లనియెను.

"మీరు ఒకరినొకరు తప్పు దారిని పట్టించుటకు ప్రయత్నించుచున్నారు. మీరే మోసపోవుచున్నారు. సూర్యుడు భూమిచుట్టును తిరుగుటలేదు. భూమియే సూర్యునిచుట్టును తిరుగుచున్నది. అట్లుతిరుగుచున్నప్పుడు భూమి తనచుట్టు తాను తిరుగుచున్నది. అందుకు ఇరువదినాలుగు గంటలు (ఒకరోజు) పట్టును. కావున దినములో కొంతకాలము భూమిలోని కొంత భాగము సూర్యునికెదురుగా నుండుట తటస్థించును. అందువలన జపాను, ఫిలిప్పయినులు, సుమత్రా మున్నగు ప్రాంతములేకాక యూరపు, అమెరికా మున్నగు వివిధప్రాంతములు సూర్యుని కెదురుగావచ్చును. సూర్యుడొక పర్వతము కొఱకుగాని, ఒక దీవికొఱకుగాని, ఒకసముద్రము కొఱకుగాని, భూమికొఱకు గాని ప్రకాశింపడు. ఆతడింకను భూమివంటి అనేక గ్రహముల కొఱకు ప్రకాశించును. మీ పాదములక్రిందనున్న భూమి వంకకు చూచుటకుబదులు, ఆకశమువంకకు చూడుడు. అప్పుడు మీకంతయు అర్థమగును. సూర్యుడు ఏ ఒక్కనికొఱకుగాని ఏ ఒక్క దేశము కొరకుగాని ప్రకాశించుటలేదని మీరు చక్కగా తెలిసికొనగలరు."

ఆవిధముగా ప్రపంచయాత్రచేసియు, ఆకశమందలి గోళములను గూర్చియు తెలిసికొనియు గొప్పఅనుభవమును సంపాదించిన ప్రధాననావికుడు చెప్పెను.

అంతటితో చీనావాడు చెప్పదలచిన కథపూర్తి ఆయెను. పిమ్మట ఆతడింకను ఇట్లనియెను, "అదే విధముగా

మతమునకు సంబంధించిన విషయములలో తానేగొప్పవార మను గర్వము వలననే మానవులకు విభేదాభిప్రాయములు కలిగి కలహించుకొనుచున్నారు. సూర్యుని గూర్చి ఎట్లుకల హించుకొనిరో దేవునిగూర్చిగూడ అట్లే కలహించుకొను చున్నారు. ప్రతిఒక్కరు తమకు గాని తమదేశమునకుగాని ప్రత్యేకము దేవుడుండవలెనని వాంఛించుచున్నారు. ప్రతి ఒక్కరు తమ దేవాలయములోనే భగవంతుని బంధింప వలె నని కోరుచున్నారు. విశ్వవిహారముచేయు భగవానుని ఏఒక్క రును బంధింపలేరు.

"మానవులందఱును ఐకమత్యముగా నుండవలెననియు ఒకే విశ్వాసమును కలిగి యుండవలెననియు భగవంతుడు ఈ ప్రపంచ మను దేవాలయమును సృష్టించియున్నాడు. ఇంత కంటె గొప్పదేవాలయ మింకొకటి ఏదియుండును?"

"మానవులు నిర్మించిన దేవాలయములన్నియు, భగ వంతుడు నిర్మించిన దేవాలయము ననుసరించియే నిర్మింపబడి నవి. ప్రతిదేవాలయములోను నీటితొట్టెలు, పైకప్పులు, దీప ములు, శిల్పములు, పటములు, శాసనములు, గ్రంథములు, పూజాద్రవ్యములు, బలిపీఠములు మున్నగునవి ఉండును. కాని ఏ దేవాలయములో సముద్రమువంటి నీటితొట్టెఉన్నది? ఏ దేవాలయములో ఆకసములోని గోళములవంటివి యున్నవి? సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములవంటి దీపములు ఏ దేవా లయములో నున్నవి? పరస్పరము సహాకారముచేసికొను మంచి మానవులవంటి విగ్రహములు ఏ దేవాలయములో ఉన్నవి? భగవానుడు మానవులకు చేయుచున్న మహోపకార

ములవంటి శాసనములు ఏ దేవాలయములో నున్నవి? ప్రతి మానవుని హృదయములోను స్పష్టముగా నున్నటువంటి వ్రాతలు ఏ గ్రంథములలోనున్నవి? మానవులు పరస్పరము చేసికొను త్యాగములవంటివి ఏ దేవాలయములో ఉన్నవి? మానవుని మంచి హృదయమువంటి బలిపీఠము ఏ దేవాలయములో ఉన్నది?"

"భగవానుని మహిమను గూర్చి గొప్పఅభిప్రాయమును ఏర్పఱచు కొన్నకొలది ఆతనిని ఎక్కువగా అర్థముచేసికొనుటకు మంచి అవకాశములు కలుగును. భగవంతుని ఎక్కువగా అర్థము చేసికొన్నకొలది మానవులాతనికి దగ్గఱగా పోగలరు. అనగా వారు భగవానునివలె మంచితనమును, కరుణను, దయను, ప్రేమను చూపుదురు; తోడిమానవులను చక్కగా ప్రేమింతురు."

"కావున ప్రపంచమంతటను నిండియుండు సూర్య కాంతిని చూచువారు ఒకరినొకరు దూషించుకొనరాదు. ప్రతి ఒక్కడు తన విగ్రహములో ఒకేకాంతికి సంబంధించిన కిరణమును చూచును. వేర్వేఱు కిరణములను చూచువారు ఒకరి నొకరు ద్వేషించుకొనరాదు. సూర్యుని చూడలేని గ్రుడ్డివాడు సూర్యుడు లేడన్నను ఆతనిని ఎవ్వరును నిందింపరాదు."

ఆ విధముగా కన్ఫ్యూసియస్ బోధన లనుసరించి జీవితమును సక్రమముగా గడపుచున్న చీనావాడు చెప్పెను.అప్పుడు కాఫీ దేవాలయములోనున్న వారెవ్వరును మాఱుమాటాడలేక నిశ్శబ్దముగా కూర్చుండిరి. వారింక ఏ మతముగొప్పది అను విషయమును గూర్చి ఏమాత్రము తగవులాడకుండిరి.

అస్సీరియా రాజు

ఒకానొక కాలమున అస్సీరియారాజు, లైలీరాజు రాజ్యమును జయించెను. అనేక పట్టణములను తగుల బెట్టి సర్వనాశనము చేసెను. రాజ్యములోని వారినందఱను తన దేశమునకు ఖైదీలుగా తీసికొనిపోయెను. పీకులను చిత్రవధ చేసెను. ముఖ్యమైన వారి తలల నుత్తరించెను. ఇతరులను కఠిన ముగా శిక్షించెను. లైలీరాజును ఒకబోనులో బంధించెను.

ఒకనాటిరాత్రి అస్సీరియారాజు తన శయ్యపై పరుండి లైలీరాజును ఉరితీయుట ఎట్లాయను విషయమునుగూర్చి ఆలో చింప సాగెను. అంతలో నాతని శయ్యకు సమీపముననే గల గల మను ధ్వని వినబడసాగెను. అప్పుడురాజు కన్నులు తెఱచి చూచెను. ఆతనికి పొడుగుపాటి గడ్డమును, ప్రశాంతమైన కన్నులును గల వృద్ధుడొకడు కనబడెను.

"నీవు లైలీరాజును ఉరితీయ గోరుచున్నావా?" అని వృద్ధుడు ప్రశ్నించెను.

"అవును" అనిరాజు సమాధానమిచ్చెను. "కాని అది ఎట్లుచేయవలెనో నేనింకను నిర్ణయించుకొనలేదు."

"కాని నీవే లైలీవి"అని వృద్ధుడనెను.

"నీవుచెప్పునది సత్యముకాదు"అని రాజు జవాబిచ్చెను. "లైలీ, లైలీయే; నేను నేనే"

నీవు, లైలీ ఒక్కరే!"అని వృద్ధుడనెను. "నీవు లైలీ కాదనియు, లైలీ నీవు కాదనియు అనవసరముగా ఊహించు చున్నావు."

"నీ మాటల అర్థమేమో నాకు తెలియుటలేదు!" అని

రాజనెను. "ఇదిగో, నే నిప్పట మెత్తని పరుపులపై పరుండి యున్నాను. నా చుట్టును నే నేపనిచెప్పినను చేయుటకు సిద్ధముగానున్న మగబానిసలు, ఆడబానిసలు పలువురున్నారు. నేనీరోజున నాస్నేహితులతో కలసి గొప్పవిందులో పాల్గొన్నాను. రేపుకూడా అట్లే చేయుదును. మఱి నైలీ పక్షివలె పంజరములో బంధింపబడియున్నాడు. రేపు నేనాతనిని కఠినముగ శిక్షింతును. ఆతడు నాలుక బయటకు చాచి మరణించువఱకు అమితముగా బాధపడును. ఆతని శరీరమును ముక్కలు ముక్కలు ముక్కలుగా చీల్చివేయును."

"నీవాతనిని నాశనము చేయలేవు" అని వృద్ధుడనెను.

"నేను పదునాలుగు వేలమంది వీరులను చంపివైచినాను. ఇందులకు ఏమియగును? నేను జీవించియేయున్నాను. కాని వారుమాత్ర మింక ఈలోకమున లేరు. దీనినిబట్టి నేను మానవుల జీవితములను సర్వనాశనము చేయగలనను నగ్నసత్యము స్పష్టముగా కనంబడుటలేదా?" అని రాజనెను.

"వారింక లేరని నీకెట్లు తెలియును?" అని వృద్ధుడు ప్రశ్నించెను.

అప్పుడు రాజు ఇట్లనియెను. "మఱి నేను వారినింక చూచుటలేదుగదా! వారు నానాహింసలపాలు అయినారు. నేను మాత్రము కాలేదు. వారికి హాని కలిగినది. నేనుమాత్రము బాగుగనేయున్నాను."

"నీకట్లు కనబడుచున్నది. కాని నిజముగా నిన్ను నీవే హింసించుకొన్నావు. వారిని హింసింపలేదు."

"నా కర్థమగుటలేదు" అని రాజు అనెను.

"నీవర్థము చేసికొనగోరుచున్నావా?"

"అవును!"

"అయినచో ఇటు రమ్ము." అని యని వృద్ధుడు రాజుకు ఒక పెద్ద నీటితొట్టెను చూపెను. రాజు శయ్యపైనుండి లేచి తొట్టెను సమీపించెను.

"దుస్తులను తీసివైచి తొట్టెలోనికి దిగుము."

అపుడు అస్సీరియారాజు, వృద్ధుడుచెప్పినట్లే చేసెను.

అంతట వృద్ధుడొక పాత్రను నీటితో నింపుచు రాజుతో ఇట్లనియెను." నేనీ నీటిని నీతలపై పోయుటకు ప్రారంభింపగనే నీటిలోనికి మునుగుము."

పిమ్మట వృద్ధుడు రాజుతలపై పాత్రలోని నీటిని పోయ సాగెను. అంతట రాజు పూర్తిగా నీటిలో మునిగెను.

రాజు నీటిలో మునిగిన తరువాత తానింక అస్సీరియా రాజును కాననియు, వేఱొక మనిషిననియు గ్రహించెను. అత డొక సుందరమైన శయ్యపై పరుండియుండెను. ఆతనిప్రక్కనే ఒక భూలోకసుందరి యుండెను. ఆమెనాతడంతకు మునుపు చూచియుండలేదు. కాని ఆమె తన భార్యయను విషయ మాతనికి తెలియును. ఆసుందరి శయ్యపైనుండి లేచి ఆతనితో ఇట్లనెను.

"ప్రియనాథా! లైలీరాజా! నిన్న చేసిన పనివలన మీరు బాగుగా అలసిపోయినారు. అందువలన మీరు మామూలు కంటె ఎక్కువసేపు నిదురించినారు. నేను మీకు నిద్రా భంగము కలుగకుండ రక్షించినాను. మిమ్ము నిదురనుండి లేపలేదు. అనేకమంది సామంతులు మీకొఱకు విశాల మంది

రములో వేచియున్నారు. మీరిప్పుడు చక్కని దుస్తులను ధరించి అచ్చటకుపోయి వారిని కలిసికొనుడు."

ఆ సంభాషణవలన తాను లైలీనను విషయమును అస్సీరియారాజు గ్రహించెను. అందులకాతడేమాత్ర మాశ్చర్యపడలేదు. ఆవిషయమంతకుముందే తెలియునందుకు మాత్ర మాతడాశ్చర్య పడుచుండెను. వెంటనే ఆతడు శయ్యపైనుండి లేచి మనోహరమైన దుస్తులు ధరించి, పలువురు సామంతులు వేచియున్న విశాలమైన మందిరములోనికిపోయెను.

సామంతులు, లైలీరాజును చూడగనే భూమిపై కివంగి నమస్కరించిరి. మిమ్మట వారు లేచి రాజునాజ్ఞను తీసికొని కూర్చుండిరి. తరువాత సామంతులలోకెల్ల పెద్దవాడు ఇట్లనియెను. "ప్రభూ! దుష్టుడగు అస్సీరియారాజు పెట్టుచున్న అవమానములను మేమింక సహింపలేము. మనమాతనితో యుద్ధము చేయవలసిన సమయమాసన్నమైనది." అప్పుడు రాజు ఇట్లనియెను. "యుద్ధముచేయుట మంచిపనికాదు. నేనాతనివద్దకు సమర్థులగు రాయబారులను పంపుదును." పిమ్మట నాతడు సామంతులను పంపించివేసెను. తరువాత నాతడు మంచి సమర్థులను పిలిపించి అస్సీరియా రాజువద్దకు రాయబారము పంపెను. ఆపనిని పూర్తిచేసిన తరువాత నాతడు వేటకు బయలుదేరి పోయెను. వేట చాల విజయవంతముగా గడచెను. అతడు స్వయముగా రెండు అడవి గాడిదలనుచంపి యుండెను. ఇంటికివచ్చిన తరువాత ఆతడు కొంతమంది స్నేహితులతో కలసి మనోహరమగు విందులో పాల్గొనెను. తరువాత ఒక చక్కని నృత్యప్రదర్శనమును తిలకించెను.

మఱునాడు రాజు ఆస్థానమునకుపోయెను. అప్పుడచ్చట ఆతని కొఱకు పలువురు వేచియుండిరి. కొంతమంది విచారింప బడవలసిన ఖైదీలుకూడ నుండిరి. రాజు ఎప్పటివలె అచ్చట పూర్తిచేయవలసిన పనినంతను పూర్తిచేసికొనెను. పని పూర్తి యైన తరువాత నాతడు తనకు అత్యంత ప్రియమైన వేటకు బయలుదేఱిపోయెను. ఆనాడు గూడ వేట విజయవంతముగనే యుండెను. ఈసారి ఆతడు ఒక ముసలి ఆడసింహమును పట్టు కొని యుండెను. పైగా దాని రెండుపిల్లలను కూడ పట్టుకొని యుండెను. వేటపూర్తిఅయిన తరువాత ఆతడింటికి తిరిగివచ్చి మిత్రులతో కలసి తిరిగి విందులో పాల్గొనెను. పిమ్మట కమ్మని సంగీతమును వినెను; చక్కని నాట్యమును చూచెను. ఆతడా నాటిరాత్రి గాఢముగా ప్రేమించిన భార్యతో కలసియుండి చక్కగా సుఖములను అనుభవించెను.

ఆవిధముగా రాజు రాచకార్యములను చక్కగానిర్వ హించుచుండెను; ఆనంద సాగరమున మునిఁగి తేలియాడుచుం డెను. అటుల కొన్ని దినములు గడచెను; కొన్ని వారములు గడ చెను. ఆతడు, అస్సీరియారాజు వద్దకు పంపిన రాయబారులు తిరిగి వత్తురని ఎదురుచూచుచునే యుండెను. ఒకనెల గడచిన తరువాతమాత్రమే రాయబారులు తిరిగివచ్చిరి. అప్పుడు వారి ముక్కుచెవులు కోయబడియుండెను!

అస్సీరియారాజు ఆరాయబారులతో ఇట్లు చెప్పియుం డెను, "యిప్పుడు మీకు ముక్కుచెవులు కోసినాను. మీరాజు తలలీకికూడ ఇట్లేచేయుదును. ఆతడు వెంటనే నాకు బంగారము నిండి మున్నగువానిని పంపి స్వయముగావచ్చి కలసికొన్నచో

మాత్రమే క్షమింతును." ఆవిషయమునే రాయబారులు రాజుకు చెప్పిరి.

అంతట లైలీ(ఆతడే పూర్వపు అస్సీరియారాజు!) తిరిగి తనసామంతుల నందఱును సమావేశపఱచి జరిగిన విషయములను తెలిపి ముందుకర్తవ్యమును గూర్చి ఆలోచించెను. అప్పుడా సామంతులందఱు ముక్తకంఠముతో ఇట్లనిరి, "అస్సీరియారాజు మనమీద దండెత్తునట్లు మనము చేతులు ముడుచుకొని కూర్చుండరాదు. మనమే ముందు యుద్ధమును ప్రకటించి ఆతనిపైకి దండెత్తవలెను." అందుకు రాజు అంగీకరించెను. ఆతడు సైన్యమునకు నాయకత్వము వహించి, ముందుండి దండయాత్రకు బయలుదేరెను. దండయాత్ర ఏడు దినములు సాగెను. ప్రతిదినమును రాజు సైన్యముచుట్టును తిరిగి వారిలో ధైర్యసాహసములను రేకెత్తింపసాగెను. ఎనిమిదవ దినమున ఆతని సైన్యము ఒకవిశాలమైన లోయలో అస్సీరియారాజు సైన్యము నెదుర్కొనెను. ఆలోయమధ్య ఒకనది కూడ ప్రవహించుచుండెను. లైలీ సైన్యము గొప్ప ధైర్యసాహసములతో పోరాడసాగెను. లైలీ (పూర్వపు అస్సీరియారాజు) శత్రువులు సర్వతములపైనుండి చీమల బారులవలె క్రిందకు దిగుచు విశాలమైన లోయనాక్రమించుచు తనసైన్యమును లోబఱచు కొనుటకు ప్రయత్నించుచున్న దృశ్యమును చూచెను. అంతట నాతడు రథములో కూర్చుండి యుద్ధభూమి మధ్యకుదుమికి శత్రువులను దునుమాడసాగెను. కాని లైలీ యుద్ధ వీరులు వందలకొలది మాత్రమే యుండిరి. అస్సీరియారాజు వీరులు వేలకొలది యుండిరి. అందువలన లైలీకి గాయ

ములు తగిలెను. కడకాతడు ఖైదీగా పట్టుకొనబడెను. శత్రువు లాతనిని కట్టివైచి ఖైదీగా తీసికొని పోసాగిరి. ఆవిధముగా తొమ్మిది రోజులు గడచెను.

పదియవ దినమున ఆతడు ముఖ్యనగరమునకు తీసికొని పోబడి ఒక బోనులో బంధింపబడెను. ఆకలివలనగాని, గాయముల వలనగాని అంతగా బాధపడుటలేదు! అవమానముతోను, అణగారియున్న కోపముతోను ఆతడు మిక్కుటముగా బాధపడు చుండెను. "అయ్యో? నేనెంత బాధపడుచున్నాను! కాని శత్రువుపై పగదీర్చుకొను అవకాశము అణుమాత్రమైనను లేదే! నాకు శక్తిలేదే!" అని యాతడెంతయు విచారింపసాగెను. ఆతడు చేయగల పని యొక్కటిమాత్రమున్నది. తన బాధను శత్రువులు చూడకుండ మాత్రముచేయగలడు! అందువలన ఆతడు ఏమాత్రము సణగక ధైర్యముతో శత్రువులు పెట్టు బాధలనన్నిటిని సహింపసాగెను. మరణము నెదురుచూచుచు ఆతడు బోనులో ఇరువదిరోజులుండెను. తన బంధువులు, మిత్రులు మున్నగువారు మరణించుట నాతడుచూచెను. మరణించుచున్న వారి ఆర్తనాదముల నాతడు వినెను. కొంత మందికి కాలుచేతులు నరకబడెను. మఱికొంతమందికి ప్రాణములతో ఉండగానే చర్మము ఒలవబడెను. కాని ఆతడు మాత్రము కలతపడలేదు; జాలినిగాని భయమునుగాని వెలిపుచ్చలేదు. ఆతడెంతో గొప్పగా ప్రేమించిన భార్య బంధింపబడి యుండుటను చూచెను. ఆమె అస్సీరియారాజు వద్దకు బానిసగా తీసికొని పోపడుచున్నదను విషయమును ఆతడు గ్రహించెను. ఆతడా దుఃఖమునుగూడ ప్రశాంతముగ భరించెను.

కాని అతనికి కాపలాగా ఉన్న భటులలో ఒకడిట్లనీయెను, "లైలీ రాజా! నా కెంతయు విచారముగనున్నది. ఒకప్పుడు నీవు రాజువు. ఇప్పుడు నీ వెవరవు? నీకెట్టిగతి సంప్రాప్తించినది?" ఆ మాటలను వినగానే ఆతడు సర్వస్వమును కోల్పోయిన విషయమును జ్ఞప్తికి తెచ్చుకొనెను. ఆతడు బోనుకడ్డీలను గట్టిగా పట్టుకొని, ఆత్మహత్యచేసికొనవలెనను తలంపుతో తలతో కడ్డీలను గట్టిగా బాదసాగెను. కాని అట్లుచేయుటకాతనికి తగినశక్తి లేదు! ఆతడు నిస్పృహతో మూలుగుచు క్రిందబడెను.

ఎట్టకేలకిరువురు రాజభటులు బోనుతలుపులు తెఱచిరి. ఆతని రెండుచేతులను వెనుకకు విరిచి గట్టిగా కట్టివైచిరి. పిమ్మట నాతనిని వధ్యస్థలమునకు తీసికొనిపోయిరి. ఆ ప్రదేశమంతయు రక్తముతో నిండియుండెను. రాజభటులాతని దుస్తులనుపూర్తిగా తొలగించిరి. ఒకప్పుడు ఎంతో అందముగను బలిష్ఠముగను ఉన్న తన శరీరమప్పుడు నీరసించి యున్న దృశ్యమును చూడగా ఆతనికి మాట రాకుండెను. రాజభటులాతనిని నీరసించిన తొడలు పట్టుకొని పైకెత్తి కొయ్యపై పెట్టుకొని సిద్ధముగానుండిరి.

ఎంతో ధైర్యసాహసములతో ఉండవలెనని నిశ్చయించుకొన్న రాజు నిశ్చయము సడలిపోయెను. తనకింక మరణము తప్పదని ఆతడు భావించెను. అందువలన నాతడు గోలుగోలున నేడ్చుచు తన్నురక్షింపవలసినదని దీనాతిదీనముగ ప్రార్థింపసాగెను. కాని యాతని ప్రార్థనలను వినువారెవ్వరును లేకుండిరి.

కడకాతడిట్లను కొనియెను, "నేనుమరణించబోవు చున్నా

ననుమాట నిజముకాదు. నేనిప్పుడు నిదురించుచున్నాను. ఇది యంతయు ఒక పీడకల” అనుటవలన నాతడు నిదురనుండి మేల్కొనుటకు గట్టిప్రయత్నము చేసెను. అందాతడు విజయమునే సాధించెను. కాని అప్పుడాతడొక మృగమువలె ఉండెను. “నేనిప్పుడొక మృగమువలె నున్నాను! నాకీవిషయమింతకుముందు తెలియనే తెలియదు! ఇది యంతయు ఆశ్చర్యకరముగనున్నది!”అని ఆతడనుకొనసాగెను.

ఆతడొక లోయలో మేత మేయుచుండెను; లేతగడ్డిని పండ్లతో చీల్చివేయుచుండెను, పొడుగుపాటి తోకతో ఈగలు మున్నగు వానిని తోలివేయుచుండెను. ఆతని చుట్టును గాడిద పిల్ల యొకటి తిరుగుచుండెను. అది యొకసారి కడువేగముతో ఆతనివద్దకు వచ్చి కడుపుక్రింద మూతిపెట్టి పాలుత్రాగుటకు ప్రారంభించెను. అప్పుడాతనికి తానొక ఆడ గాడిద ననియు, ఆ గాడిదపిల్ల తల్లిననియు తెలిసివచ్చెను. ఆ విషయమాతనికి ఆశ్చర్యమును గొలుప లేదు! విచారమును కలిగించ లేదు; పైగా అపరిమిత మగు ఆనందమును గొలుపసాగెను. పిల్లకు పాలిచ్చుట నిజముగా ఆతని కెంతయు ఆనందము నొసంగుచుండెను!

కాని అంతలో ఆతనివద్దకు ఒకవాడియైన అమ్ము ఎగురుచు వచ్చెను. అది యాతని ప్రక్కకు గుచ్చుకొని చర్మమును చీల్చివైచి మాంసములో దూరెను. అప్పుడాతనికి ఎంతో బాధ కలిగెను ఆబాధతో నాతడు పిల్లను విదిలించుకొని గాడిదల మందవద్దకు వేగముగా పరుగెత్తుకొని పోసాగెను. గాడిదపిల్ల కూడ అతని వెంటపడి పరుగెత్తుకొని పోవుచుండెను. కదలి పోవుచున్న గాడిదలమందను చేరుకొనునప్పటికి మరియొక వాడి అమ్ము

[illegible] వేగమున వచ్చి గాడిదపిల్ల మెడకు గ్రుచ్చుకొనెను. ఆయమ్ము చర్మమును చీల్చుకొని మాంసములో దూరెను. గాడిదపిల్ల అపరిమితమైన బాధతో నఱచి నేలపైబడెను. అంతట నాతడు గాడిదపిల్లను వదలలేక దానివద్దనే నిలబడి యుండెను. గాడిదపిల్ల లేచి కొంచెము ముందుకుపోయి మరల నేలపై బడెను. అంతలో నొకమానవు డచ్చటకు వచ్చి దాని మెడ నుత్తరించెను.

"ఇది నిజముకాదు. అంతయునొక కల. నేను లైలీనే మాత్రముకాదు. గాడిద సంతకంబుకాదు. నేను అస్సీరియా రాజునే!" అని అస్సీరియారాజు మేల్కొనుటకు ప్రయత్నించుచు ననుకొనెను.

అదే సమయమున నాతడు గట్టిగానఱచి నీటిలోనుండి తలను పైకెత్తెను. ముసలివాడాతని ప్రక్కనే నిలబడియుండెను.

అప్పుడు ముసలివాడిట్లనియెను. "ఎంతోసేపా! నీ విప్పుడే తలను నీటనుంచి వెంటనే పైకెత్తినావు. చూడుము, పాత్రలోని నీరు పూర్తిగా బయటకైనను రాలేదు. ఇప్పుడు నీకంతయు నర్థమైనదా?"

అస్సీరియారాజు, ముసలివానితో నిట్లనెను, "నేనెంతగా బాధపడినాను! ఎంతోసేపు బాధపడినాను!"

అస్సీరియారాజేమియు సమాధానమీయలేదు. కాని ముసలి వాని వంకకు భయముతో చూడసాగెను.

ముసలివాడింకను నిట్లనియెను, "లైలీయే నీవనియు, నీవు మరణము పాల్జేసిన వీరులందఱు నీవేయనియు నిప్పుడర్థమైనదా? వీరులు మాత్రమేకాదు. నీవు అనేక జంతువులను

మంత్రులున్నారు; మతాధికారి యొకడున్నాడు; సైనికాధి
కారులున్నారు; సైన్యమున్నది.

ఆరాజ్యములోని సైనికదళమంత పెద్దదికాదు. అందు
అనువదిమంది సైనికులుమాత్రమే యున్నారు. అయినను నది
యొక సైనికదళమే! ఇతరరాజ్యములలోవలె ఆరాజ్యములో
గూడ పన్నులుగలవు. పొగాకుపన్ను; సారాపన్ను మున్నగు
పన్నులన్నియు నచ్చట వసూలుచేయబడుచున్నవి. అచ్చటి
ప్రజలు, ఇతర ప్రజలవలెనే సారా త్రాగుదురు; చుట్టలు
కాల్చుదురు. కాని, యంతమాత్రమున రాజుకు గలిగిన లాభ
మెద్దియు లేదు. ఆతని కందువలన స్వల్పమగు నాదాయము
మాత్రమే వచ్చుచుండెను. అందువలన రాజు మంచి ఆదాయ
మును సంపాదించు చక్కని ఉపాయమును కనిపెట్టెను. ఆత
డొక జూదగృహమును నిర్మించెను. అచ్చట పలువురు నిత్య
మును జూదమాడుచుండెడివారు, వారివలన రాజుకు కావలసి
నంత ఆదాయము వచ్చుచుండెను. జనులు నెగ్గినను, ఓడినను
రాజునకు చెల్లించవలసిన ముడుపుమాత్రము తప్పదు గదా!
యూరపుఖండములోకెల్ల నది యొక్కటియే జూదగృహము.
పూర్వము కొంతమంది జర్మనురాజులుగూడ అట్టి జూదగృహ
ములను నడుపుచుండెడివారు. కాని కొన్ని సంవత్సరముల
క్రిందట నవి యన్నియు నిషేధింపబడెను. కావుననే యూరపి
యనులందఱు, మొనాకో జూదగృహమునకే వచ్చుచుండెడి
వారు. అందువలననే మొనాకో రాజుకు కావలసినంత ఆదా
యము. జర్మను జూదగృహములు నిషేధింపబడుటకు కారణ
మేమి? వానివలన నెంతో హాని జరుగు ననుటలో ఎట్టి సంది

యమును లేదు. ఒక మనుజుడున్నాడనుకొనుడు. ఆతడు తన యదృష్టమును పరీక్షించుకొనుటకై జూదగృహమునకు వచ్చెను. తనకున్న దంతయు నొడ్డి, దురదృష్టవశమున పోగొట్టుకొనెను. అంతట నాతడు తనది కానిడబ్బును ఒడ్డెను. దానిని గూడ పోగొట్టుకొనెను. అంతట నాతడు నిరాశతో, నిస్పృహతో నీటిలో మునిగియో, తుపాకితో కాల్చుకొనియో ఆత్మహత్య చేసికొనెను. అందువలననే జర్మను జూదగృహములు నిషేధింపబడెను. మొనాకో రాజు జూదగృహమును మాత్ర మెవ్వరును అడ్డుపెట్టరైరి. అందువలన నాతనికది యొక గుత్తవ్యాపారముగా తయారయ్యెను.

అందువలననే జూదమాడదలచిన ప్రతివారును మొనాకో జూదగృహమునకే వత్తురు. వారు నెగ్గిననేమి? ఓడిననేమి? మొనాకో రాజుకు మాత్రము కావలసినంత లాభమువచ్చెను. "కష్టపడి చెమటోడ్చి పనిచేసినవాడు మేడలు నిర్మింపలేడు. ప్రతియొక్కడు సులువుగా డబ్బు సంపాదించు నుపాయమును నేర్చియుండవలెను." జూదగృహమును నడుపుట మంచిపని కాదను విషయము మొనాకో రాజుకు తెలియును. కాని ఆతడేమిచేయును? ఆతడు జీవింపవలెను, రాజ్యపరిపాలనచేయవలెను. ఒకదృష్టితో చూచిన పొగాకుపన్ను, సారాపన్ను మున్నగునవికూడ మంచివికావు. కాని ఆదాయముకొఱ కిట్టి పన్నులను విధింపక తప్పదు. మొనాకోరాజు ఎన్నోవిధముల ఆదాయమును సంపాదించుచు నిజమైన రాజువలె పరిపాలన చేయుచుండెను.

కొన్ని వత్సరముల క్రిందట నా చిన్న రాజ్యములో నొక

హత్య జరిగెను. ఆరాజ్యములోని జనులందఱు శాంతిప్రియులు; అందువలన నచ్చట నంతవఱకు హత్యలు జరుగలేదు. మఱి హత్యలు జరుగుట కదియే ప్రారంభము. న్యాయాధికారులు, తమ దర్జాను చూపుచు హత్యానేరమును విచారించుటకై సమావేశమైరి; ఇతరదేశములలోని పద్ధతుల ననుసరించియే విచారణసల్పిరి. న్యాయాధికారులు, ప్రభుత్వ న్యాయవాదులు, జూరీవారు, ఇతర న్యాయవాదులు ఆ విచారణలో పాల్గొనిరి. న్యాయవాదులు రకరకములుగా వాదించిరి. కడకు న్యాయాధికారు లొక నిర్ణయమునకు వచ్చిరి. హత్యచేసినవాని తల నుత్తరింపవలెనని వారు తీర్పునిచ్చిరి. ఆతీర్పు చట్టసమ్మతమైన దనుటలో నెట్టిసందియమును లేదు. అంతవఱకు నంతయు బాగుగనేయున్నది. తరువాత న్యాయాధీశులు తమ తీర్పును మొనాకో రాజుకు తెలియజేసిరి. రాజా తీర్పును చదివి, దానిని ధ్రువపఱచెను. "నేరముచేసిన వానిని ఉరితీయవలసి వచ్చినచో, ఉరితీయవలసినదే" అని యాతఁ డధికార పూర్వకముగ ననెను.

కాని యావిషయములో వారికొక గొప్పచిక్కువచ్చెను. వారి రాజ్యములో ఉరితీయు యంత్రసాధనములు లేవు. ఉరితీయువాడు లేడు. అందువలన నావిషయమునుగూర్చి మంత్రిమండలివారు దీర్ఘముగా ఆలోచించిరి. ఎట్టకేలకు వారు, "మాకు ఉరితీయు సాధనసామగ్రిని, ఆసామగ్రిని ఉపయోగించుట చేతనైన వానిని పంపుడు" అని ఫ్రెంచి ప్రభుత్వము వారిని కోరవలెనని నిశ్చయించుకొనిరి. ఉరితీయు సాధనము ఖరీదెంతయోకూడ వారు తెలిసికొనగోరిరి. వెంటనే వారు

ఫ్రెంచిప్రభుత్వమువారికి కావిషయములనుగూర్చి యొక యుత్తరమును బంపిరి. ఒక వారమురోజుల తరువాత వారి యుత్తరమునకు జవాబిచ్చెను. ఆయుత్తరములో ఫ్రెంచిప్రభుత్వమువారిట్లు వ్రాసియుండిరి. "ఉరితీయు యంత్రమును, దాని నుపయోగించుట తెలిసినవానిని మీరు కోరినప్రకారము పంపగలము. యంత్రము ఖరీదు పదునాలు వేల ఫ్రాంకులగును." మంత్రిమండలి వారా యుత్తరమును రాజుముందుంచిరి; రాజా విషయమునుగూర్చి దీర్ఘముగా ఆలోచించెను. పదునాలు వేల ఫ్రాంకులు! ఆవిషయమునుగూర్చి రాజిట్లనెను, "హత్యచేసిన దుర్మార్గుడు పదునాలు వేల ఫ్రాంకుల ఖరీదుండడు, అంతకంటె చౌకగా మన మీపనిని ముగింపలేమా? మన జనాభాలో ఒక్కొక్కనివద్ద రెండు ఫ్రాంకులసొమ్ము ప్రోగుచేసినను పదునాలు వేల ఫ్రాంకులసొమ్ము ప్రోగుపడదు. మఱియు ప్రజలు దీనిని భరింపరు; వారివద్ద డబ్బు వసూలుచేయుట ప్రారంభించినచో తిరుగుబాటువచ్చుట తథ్యము."

అందువలన మంత్రిమండలివారు మరల సమావేశమై ముందు కర్తవ్యమునుగూర్చి దీర్ఘముగా ఆలోచించిరి. ఎట్టకేలకు వారు ఫ్రెంచిప్రభుత్వమువారికి వ్రాసినట్లే, ఇటలీ ప్రభుత్వమువారికిగూడ వ్రాయవలెనని నిశ్చయించుకొనిరి. ఫ్రెంచిప్రభుత్వము ప్రజాప్రభుత్వము; అందువలన వారికి రాజులనిన సరియైన గౌరవభావము ఉండదు. కాని ఇటలీలో రాజరికమున్నది. ఇటలీరాజు, మొనాకోరాజుపట్ల సానుభూతితో యంత్రమును తక్కువధరకు పంపు నవకాశమెంతేని కలదు. వెంటనే ఇటలీ ప్రభుత్వమునకు ఉత్తరము వ్రాయబడెను.

అనతికాలములో దానికి జవాబుగూడ వచ్చెను.

ఇటలీప్రభుత్వమువారు ఇట్లు వ్రాసియుండిరి. "మేము ఉరితీయుట కుపయోగించు యంత్రమును, దాని నుపయోగించుట తెలిసిన వానిని పంపగలము. మీరు మాకు పన్రెండు వేల ఫ్రాంకుల సొమ్మును పంపిన చాలును. ఇందులో మా మనిషి రాకపోకల ఖర్చులుగూడ కలిసియున్నవి." ఇటలీ ప్రభుత్వమువారు యంత్రమును ఫ్రెంచివారికంటె చౌకగా ఇత్తుమన్నమాట నిజమే, కాని మొనాకో రాజునదిగూడ పెద్ద మొత్తమే. హత్యచేసిన దుర్మార్గుడు పన్రెండువేల ఫ్రాంకుల ఖరీదు చేయనిమాట సుస్పష్టమే. అప్పటికిని ప్రతి మొనాకో పౌరునివద్దను సుమారు రెండు ఫ్రాంకులు వసూలుచేసినగాని ఆసొమ్ము పూడదు. ప్రజలాసొమ్ము నిచ్చుటకు సమ్మతింపరు. అందువలన మఱియొకసారి మంత్రిమండలివారి సమావేశము జరిగెను. హత్యచేసినవానిని తక్కువ ఖర్చులో ఉరితీయు విధానమునుగూర్చి వారు మరల దీర్ఘముగ నాలోచించిరి. సైనికులలో నెవ్వడైన నాతనిని నాటుపద్ధతి ప్రకారము ఉరితీయలేడా? ఆవిషయమునుగూర్చి వారాలోచించి, ఒక సైనికాధికారిని పిలిపించి ఆతనితో నిట్లనిరి. "హత్యచేసినవాని తలనుత్తరింపగల సైనికుని ఒకనిని తీసికొని వత్తువా? యుద్ధములో వారు జనులను సంహరించుటకు వెనుదీయరుగదా. వారికావిషయములోనే చక్కని శిక్షణ మొసగబడునుగదా." అంతట సైనికాధికారి పోయి యావిషయమునుగూర్చి సైనికులతో మాటాడెను. కాని యొక్కరును ఆపనిని చేయుట కంగీకారమును తెలుపరైరి. వారా సందర్భమున నిట్లుచెప్పిరి."

"హత్యచేసినవాని తల నుత్తరించుట యెట్లో మాకు తెలియదు. ఆవిషయమున మాకింతవఱకుఎట్టిశిక్షణమునుపొసగియుండలేదు"

మఱి అప్పుడింక నేమిచేయవలయును? మంత్రినుండలి మరల సమావేశమై ఆవిషయమై చర్చలు సలిపెను; దీర్ఘముగా నాలోచించెను. వారాసందర్భమున కొన్ని సంఘములను, ఉపసంఘములను ఏర్పాటు చేసిరి. అందఱునుకలసి బాగుగా నాలోచించి ఒక ముఖ్యనిర్ణయమునకు వచ్చిరి. "ప్రస్తుత పరిస్థితులలో చేయదగినది ఒక్కవిషయము మాత్రమున్నది. మరణశిక్షను, జీవితపర్యంతము కారాగారవాస శిక్షగా మార్చుటయే శరణ్యము. ఇట్లుచేయుట చౌక; మఱియు రాజు, హత్యచేసినవానిపట్ల కరుణను ప్రదర్శించినట్లుకూడ నుండును."

రాజు ఆ నిర్ణయమును వెంటనే ఆమోదించెను. కాని ఆనిర్ణయము నమలుపఱచుటలోగూడ ఒక చిక్కువచ్చెను. ఆ రాజ్యములో శాశ్వతఖైదీల నుంచుటకు తగిన కారాగార భవనము లేకుండెను; ఉన్న కారాగారభవనము తాత్కాలికముగ ఖైదీలనుంచుటకు మాత్రమే వీలుగనుండెను. శాశ్వత ఖైదీలనుంచుటకు గట్టి కారాగారములేదు. ఎట్టకేలకు వారు ఖైదీలనుంచుటకు తగిన ప్రదేశమును కనుగొని యాతని నందుంచిరి. అచ్చట ఒకనిని కాపలాగూడ నుంచిరి. ఆకాపలావాడు, ఖైదీ తప్పించుకొని పాఱిపోకుండ చూచుచుండవలయును. మఱియు ఖైదీకి రాజభవనపు వంటశాలనుండి భోజనమును తెచ్చి యిచ్చుచుండ వలయును.

ఆవిధముగా నెలలు గడచిపోవుచుండెను. కడకు ఒక

సంవత్సరము గడచిపోయెను. సంవత్సరము గడచునప్పటికి ఒకనాడు రాజు తన జమాఖర్చులెక్కలను చూచుకొనెను. అప్పుడాతనికి ఒక క్రొత్తవిషయమునుగూర్చి డబ్బు ఖర్చుఅగు చున్నదను సంగతి తెలిసెను. హత్యచేసినవాని కగుచున్న ఖర్చేఅది. అందును అది కొద్దిమొత్తమైననుకాదు. ఖైదీని కాపలాకాయుట కొక మనుజుడొకడుండెను. ఆతనికి భోజ నముగూడ పెట్టవలసి వచ్చుచుండెను. అందులకు సంవత్స రమునకు ఆఱువందల ఫ్రాంకులకు పైగా ఖర్చాయెను. అదియు గాక ఖైదీ ముసలివాడుకాడు; మంచి యువకుడు; చక్కని ఆరోగ్యమును కలిగియున్నాడు; ఆతడు ఇంకను ఎన్నో సంవ త్సరములు జీవించును. అంతవఱకు ఆతనికి సొమ్ము ఖర్చుపెట్ట వలయును. అదియంతయు లెక్కవేసి చూచినచో ఎంతో పెద్ద మొత్తమగును. అది నిజముగా నొక పెద్దసమస్య. రాజా ఖర్చుకేమాత్ర మంగీకరింపడు. అందువలన నాతడు వెంటనే మంత్రులను పిలిపించి వారితో నిట్లనియెను :

"ఈ దుర్మార్గుని చౌకగా వదిలించుకొను నుపాయ మును మీరుచెప్పవలయును. ఇప్పటి ప్రకారమాతని కగుచున్న ఖర్చును భరించుట నాకు తలకుమించిన పని." అంతట మంత్రి మండలివారు ముందేమి చేయవలయునను విషయమునుగూర్చి చక్కగా నాలోచించిరి. ఎట్టకేలకు ఒకమంత్రి యిట్లనియెను. "సోదరులారా! మనము కాపలావాని తీసివేయుట మంచిది. అందువలన కొంత ఖర్చుతగ్గును." అప్పుడు మఱియొక మంత్రి యిట్లనెను. "అటులచేసినచో ఖైదీ పారిపోడా?" అంతట మొదటిమంత్రి యిట్లనెను. "పాఱిపోనిండు ఆతడే నశించును!"

మంత్రిమండలివారందుల కంగీకరించి యీ విషయమును రాజుకు దెలిపిరి. రాజుకూడ నందుల కంగీకరించెను. అంతట కాపలావాడు తొలగింపబడెను. ఇకముందేమి జరుగునో యని అధికారులు వేచి చూడసాగిరి. జరిగినదేమో తెలియునా? భోజనపువేళకు భోజనము రానందున ఖైదీ బయటకువచ్చి భోజనము తెచ్చుకొనుటకై రాజుగారి వంటశాలకుపోయెను. అచ్చట వారిచ్చిన దానిని పుచ్చుకొని జైలుకు తిరిగివచ్చి లోపలనే కూర్చుండి భోజనము చేసెను. మఱునాడుకూడ నట్లే జరిగెను. సకాలమున కాతడు భోజనమును తెచ్చుకొనుటకై పోయెను. ఇక పాఱిపోవుటమాటయా? ఆతడా విషయమునుగూర్చి యాలోచించుచున్నట్లే లేకుండెను. అప్పుడింక ఏమిచేయవలయును? మంత్రిమండలివారు మరల సమావేశమై ఆలోచించిరి.

కడకు వారిట్లనుకొనిరి. "ఇక మన మాతనిని పోషింపమని స్పష్టముగా చెప్పుదము." అందువలన న్యాయశాఖామంత్రి, ఖైదీని తనవద్దకు రప్పించుకొని యిట్లనెను. "నీవెందులకు పాఱిపోవు? నిన్నడ్డుటకు కాపలావాడు లేడుకదా? నీవు నీయిచ్చవచ్చిన చోటకు పోవచ్చును. నిన్ను రాజేమియు ననడు."

"రాజేమియు ననడను విషయము నాకు తెలియును." అని ఖైదీ అనెను. "కాని నే నెక్కడకు పోను? నాకీప్రపంచములో నేమియు లేదు. నేనేమిచేయను? మీరు నాకు శిక్షను విధించి సర్వనాశనము చేసినారు? జనులెవ్వరును నన్నాదరింపరు. మఱియు నాకు పనిచేయు అలవాటు తప్పిపోయినది.

మీరు నన్ను క్రూరముగా చూచినారు. అది యేమాత్రము సమంజసముగాదు. మీరు నాకు మొదట మరణశిక్షను విధించినారు. వెంటనే మీరు నన్ను ఉరితీసి యుండవలసినది. అది యొక ముఖ్యవిషయము. నేను ఆ శిక్షను మార్చుడని ఫిర్యాదు చేసియుండలేదు. అంతట మీరు నాకు శాశ్వత కారాగార వాస శిక్షను విధించినారు. నాకు భోజనము తెచ్చుటకై ఒక కాపలావానిని నియమించినారు. తరువాత మీరాతనిని తొలగించివైచినారు. అప్పుడు నాభోజనమును నేనే తెచ్చుకొనసాగినాను. కాని ఫిర్యాదేమియు చేయలేదు. మఱి యిప్పుడు మీరు నన్ను పొమ్మని స్పష్టముగా చెప్పుచున్నారు. నేనందుల కంగీకరింపజాలను. మీరు మీయిచ్ఛ వచ్చినట్లు చేయవచ్చును. నేనుమాత్రము పోను."

మరల మంత్రిమండలివారు సమావేశమైరి. వారింక నేమిచేయవలయును? ఖైదీ ఏమో పాఱిపో ననుచున్నాడు. వారు బాగుగా ఆలోచించి, ఖైదీకి పెన్షనుఇచ్చి వదిలించుకోవలెనని నిశ్చయించుకొనిరి. పిమ్మట వారా విషయమును రాజుకు తెలిపిరి. "మనమింక చేయదగినది యేదియు కనబడుట లేదు. ఆతని నేదోవిధముగా వదలించుకొనవలెను" అని వారు అనిరి.

ఖైదీ కీయవలసిన పెన్షను సంవత్సరమునకు మూడు వందల ఫ్రాంకులని నిర్ణయింపబడెను. ఆవిషయ మాతనికి తెలియ జేయబడెను.

అప్పుడా ఖైదీ ఇట్లనెను. "మీరాసొమ్మును నిర్ణీతసమయమునకు ప్రతి సంవత్సరమును ఇచ్చినచో నాకెట్టి అభ్యంత

రము:ను లేదు. ఆపరతు పై నేను పోవుటకు సిద్ధముగనున్నాను.”

ఆవిధముగా వ్యవహారము పరిష్కారమాయెను. రాజు మూడవవంతు పెన్షనును ఖైదీకి ముందే ఇచ్చెను. అంతట నాతడు మొనాకో రాజ్యమును వీడిపోయెను. అందులకాతడు పావుగంట రైలు ప్రయాణము మాత్రముచేసెను. ఆతడు మొనాకో సరిహద్దున కావలనే కాపురము పెట్టెను. అచ్చట నాతడు కొంతభూమిని కొని పంట పండించి సుఖముగా జీవింప సాగెను. ఆతడు ప్రతిసంవత్సరము మొనాకోకు సకాలము నకు వచ్చి పెన్షను తీసికొనును. పెన్షను తీసికొన్న తరువాత. జూదగృహమునకుపోయి రెండు మూడు ఫ్రాంకులు ఒడ్డును. ఒకప్పుడాతడు నెగ్గును; మఱియొకప్పుడు ఓడును. పిమ్మట నాత డింటికి పోవును. ఆత డచ్చట శాంతియుతమగు చక్కని జీవితమును గడపును.

ఆతడా దేశములోమాత్రము హత్యచేయలేదు. ఏల యన నచ్చటివారాతనిని ఉరితీయుటకుగాని, శాశ్వతముగ ఖైదులో నుంచుటకుగాని వెనుదీయరు. ఆతడచ్చట హత్య చేయకుండుటయే మంచిపని యైనది.

